



# శతకాలు

## భక్తి,జ్ఞాన,నీతి

# వేంకటేశ శతకం








సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజీ
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి
గురు వివేకానంద
గురు సాయి బాబా
గురు అరబిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళస్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 6020010001940

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**



# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!



ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీ

# వేంకటేశ శతకం



వేమూరి వెంకటేశ్వర శర్మ

కవిశేఖర
శ్రీ ఉత్పల

అలకాపురి, హైదరాబాదు
18-2-1988

# పుణ్యాకీర్తనం

శ్రీ వేమూరి వెంకటేశ్వర శర్మ గారితో నాకు దాదాపు పాతికేండ్ల పరిచయం ఉంది. బస్సులో బజారులో కనిపించినపుడెల్ల శ్రీ శర్మగారు నాతో సాహిత్య విషయాలే మాట్లాడేవారు. సాహిత్య జిజ్ఞాసువు ఈయన అనుకొనే వాణ్ని. ఈయనతో మాట్లాడటమంటే నాకెంతో ఉత్సాహంగా ఉండేది.

ఒక రోజున ఈ శతకం తెచ్చి నాకు చూపించి "నా సాహిత్య జిజ్ఞాస ఈ విధంగా పరిణమించింది. మీరేమీ అనుకోవద్దు" అన్నారు– ఏదో తప్పు చేసినట్లు. ఇంత గొప్పపని చేసి ఇలా అంటారేమిటి అనుకొని శతకంలోని పద్యాలు చదివి సంతోషంతో ఉప్పొంగి పోయాను.

ఎంతో గొప్ప కవిత్వం చెప్పిన వారున్నారు. గొప్ప పేరు ప్రతిష్ఠలు సంపాదించుకొన్నవారున్నారు. దానితో అమితంగా ధనార్జన చేసిన వారును ఉన్నారు. అయితే భగవద్దత్తమైన తమ కవితా మాధుర్యాన్ని భగవంతునికి చెందించినవారు మాత్రం అరుదు. పుణ్యాత్ములకు మాత్రమే అలాంటి అదృష్టం పడుతుంది.

కమ్మని కంఠమిచ్చి, మధురమైన కవితనిచ్చి తనను గురించి గానం చేస్తాడేమో విందామని భగవంతుడు గోడ దటున నిలిచి చెవియొగ్గి ఉంటాడని రవీంద్రుడొకచోట అన్నాడు.

"త్వదీయం వస్తు గోవింద।
తుభ్యమేవ సమర్పయే"

కవికి ఇది పరమ కర్తవ్యం. సర్వోచ్చ ధర్మం కూడా.

శ్రీ శర్మగారు సుకృతాత్ములు. వారి కవిత భగవత్స్తుతితో ప్రారంభ మయింది. ప్రారంభ కవితయే విరియబూచిన మల్లెపొదలాగున విలసిల్లింది. ప్రాచీనాధునాతన సాహిత్య సౌరభాలను వెదజల్లుతున్నది. ఈ శతకంలో ఏ పద్యం చదివినా శ్రీ శర్మగారి వ్యుత్పన్నత, భావుకత, భక్తితత్పరతలు సువ్యక్తమవుతాయి.

"శబరి యెంగిలి తింటివి సంబరమున
విందు గొంటివి విదురుని మందిరమున
సఖుని అటుకులు తింటివి సంతసమున"

శ్రీ శర్మగారి శైలికే కాదు వారి సమ్యక్‌దర్శనానికి ఈ పద్యం ఒక మచ్చు తునుక. జీవితంలో ఒక అరగంట భగవన్నామ స్మరణంతో గడప దలచిన సామాన్య సంసారులకు ఈ శతకం పరమార్థాన్ని ప్రబోధిస్తుంది. జీవుని వేదన సాధారణీకరించి పరమాత్మునికి నివేదిస్తుంది.

"పులకరింతును నామము తలచి తలచి
తృప్తిగాంతును గరిమము నెంచి యెంచి
సంతసింతును మహిమము చాటిచాటి"

భగవంతుణ్ని మనం స్మరిస్తే, ఆయన మనల్ని స్మరిస్తాడు. భాగవత రహస్యమిదే. శ్రీ శర్మగారి అంతఃకరణ ప్రవృత్తిని ఈ భావం తెలుపుతుంది. భావం స్వభావాన్ని, స్వభావం ఇచ్ఛను, ఇచ్ఛ కర్మను తెలుపుతాయి. ఈ భక్తి శతక రచనను బట్టి శ్రీ శర్మగారి పవిత్రహృదయాన్ని మనం ఊహించు కోవచ్చు. ఈ పవిత్రమూర్తి నాకు మిత్రుడైనందుకు ఎంతో సంతోష పడు తున్నాను.

శ్రీ శర్మగారి పద్యరచనలో ఎంతో ఆరితేరిన కవి కనిపిస్తాడు. ప్రతి పద్యంవనూ హృద్యమే. సులభ సుందరము, ప్రసన్న మధురము, భక్తిభావ శోభితమూ అయిన వీరి కవితను మరల మరల చదవాలనిపిస్తుంది శ్రీ శర్మ గారు ఇలాంటి ఉత్తమ రచనలు అనేకం చేసి, ఆస్తిక లోకంలో పుణ్య గ్రంథాలు వ్యాపింపజేయాలనీ, వారికి శ్రీకృష్ణ భగవానుడు సమస్త శ్రేయస్సులు ప్రసాదించుగాక అని మనసార కోరుకొంటున్నాను.

ఉత్పల

ప్రొ. జి. వి. సుబ్రహ్మణ్యం,
ఎం.ఎ., పి. హెచ్.డి.
ఆంధ్ర శాఖాధిపతులు
కేంద్రీయ విశ్వవిద్యాలయం

హైదరాబాదు
12-1-1988

# భక్తి పంట

భక్తి శతకం ఆత్మనివేదనకు అక్షరమార్గం. నవవిధ భక్తుల్లో చివరిదీ, శ్రేష్ఠమైనదీ ఆత్మనివేదనం.

"శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాద సేవనమ్
అర్చనం వందనం దాస్యం సఖ్యా మాత్మ నివేదనమ్"

అని శ్రీమద్భాగవతం నవవిధ భక్తులను నిర్దేశించింది. భక్తుడు కవియైతే నవవిధ భక్తులనూ కవిత ద్వారా సాధిస్తాడు. ఆ సాధనకు తోడ్పడే ప్రక్రియ శతకం. శతకం ఆత్మాశ్రయ కవితకు ఆలవాలం. అది ఆత్మనాయకం కావచ్చు. దైవనాయకం కావచ్చు. దైవనాయకమైతే లీలాభివర్ణన ప్రధానంగా శతకం సాగుతుంది. ఆత్మనాయకమైతే కవియొక్క దైవరతిని పరిపోషించే భావజాలంతో ఉప్పొంగుతుంది. శతక కవితలో భగవంతుని గురించి కవి తాను స్వయంగా విన్నవీ, తెలుసుకున్నవీ, సాధనలో పొందినవీ వివరిస్తే శ్రవణభక్తి ప్రధానమౌతుంది. భగవంతుని దివ్యగుణనామ మహిమాదులను తన్మయత్వంతో కీర్తిస్తే కీర్తనభక్తి ప్రధానమౌతుంది. భగవల్లీలలను గాని, భక్తుల దివ్యానుభూతులను గాని, పూర్వస్వీయానుభూతులను గాని స్మరిస్తున్నట్లు కవిత వెలారిస్తే స్మరణ భక్తియుక్తమౌతుంది. పాదాలను సేవించడం పాదసేవనం. అయితే శతకంలో మకుట పునరావృత్తియే పాదసేవనంగా పరిభవిస్తుంది. లౌకికమైన అర్చనమంటే పూజాదికం. శతకంలో

అష్టోత్తరశత పద్య పుష్పాలను భగవంతుని కర్పించటమే అర్చనం. వందన మంటే చేతులు జోడించి ప్రార్థించటం - అంటే దశేంద్రియాలను సంపుటీకరించి ఏకాగ్రతతో భగవంతునికి సమర్పించటం. శతక కవితలో శబ్దార్థాలను సంఘటించి పద్యాలను రచించి, పఠిత మనస్సును భగవంతునిపై లగ్నమయ్యేట్టు సంఘటించటం. భగవంతుని ప్రభువువలె సేవించటం దాస్యం. భగవంతుని నాయకునిగా భావించి కవి కవితతో సేవించటం దాస్యం. అంతేకాదు. శతక పద్యాలలో హృద్యమైన భావాల నెన్నింటిని వెలార్చినా అవి భగవద్రతి రూపమైన భక్తికి దాస్యం చేయవలసిందే భక్తిని మించేటట్లు వివిధభావాలను వ్యక్తీకరించకుండా ఉండే నియతియే దాస్యం. సఖ్యంలో భగవంతుడూ భక్తుడూ స్నేహితులవలె గోచరిస్తారు. వ్యాజ నిందాదులతో భగవద్భక్తిని శతకంలో ప్రవచిస్తే అది కవితామయమైన సఖ్యభక్తి అవుతుంది. ఇక చివరిది ఆత్మనివేదనం ఇది శరణాగతి రూపంలో కానీ, అద్వైతానంద సాధనరూపంలో కానీ, హృదయ నివేదన రూపంలో కానీ, విరహభావ మాధుర్యంగా గానీ, ఆయా కవుల చిత్తవృత్తులనుబట్టి, భక్తిసంస్కారాలను బట్టి శతక కవితలో జాలువారవచ్చు. మొత్తానికి శతకం భక్తి ప్రస్థానానికి రసమయ మార్గం నవవిధ భక్తి తీర్థాలూ ఇందులోనే దర్శనమిస్తాయి. శతకకవి తాను భక్తి తరంగిణిగా కవితలో ప్రవహిస్తాడు. పఠిత ఆ ప్రవాహంలో మునిగి రసమూర్తిగా తానూ ప్రవహిస్తాడు.

శ్రీ వేమూరి వేంకటేశ్వర శర్మ గారి వేంకటేశ శతకం చదువుతున్నప్పుడు భక్తి శతకానికి ఉన్న శక్తిని గురించి పై విధంగా భావించే ప్రవృత్తి మనలో ప్రసన్నమౌతుంది. శర్మగారి కవిత దివ్యభవ్య ప్రేరణతో ప్రభవిల్లింది. ప్రతిభ దైవికంగా పొంగులువారినప్పుడు కవిత భక్తి ప్రసూనంగా వికసిస్తుంది. అది దైవాంకితంగా అర్పితమౌతుంది. శ్రీ శర్మ గారు తమకు స్ఫూర్తి నిచ్చిన స్వామికే తమ కవితను అర్పణం చేశారు. సూర్యుడు జలాలనిస్తాడు. మనం జలాలను ఆయనకే అర్ఘ్యంగా సమర్పిస్తాం. శర్మగారి కవిత అటువంటిది.

అష్టోత్తర శత పద్యాలలో సాగిన ఈ శతకం క్రమరహితంగా పేర్చిన పద్యహారం కాదు. శర్మగారు తమ కవితా సాధనంలో పాటించిన క్రమశిక్షణ ఈ శతక నిర్మాణంలో ప్రత్యక్షమౌతుంది. సూక్ష్మంగా పరిశీలిస్తే ఈ శతకం నవవిధ తరంగాలతో తురంగలించింది. ఆ తొమ్మిది తరంగాలనూ ఇలా పేర్కొనవచ్చు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. వేంకటేశ్వరస్వామి పరిచయ రూపంగా సాగిన మంగళా శాసనం | పద్యం | 1 | నుండి | 4 | వరకు |
| 2. దశావతార ప్రశంస | పద్యం | 5 | నుండి | 15 | వరకు |
| 3. దైవ తత్త్వాను కీర్తనం | పద్యం | 16 | నుండి | 27 | వరకు |
| 4. దైవ లీలాభి వర్ణనం | పద్యం | 28 | నుండి | 42 | వరకు |
| 5. శ్రీనివాస కల్యాణ కీర్తనం | పద్యం | 43 | నుండి | 50 | వరకు |
| 6. తిరుమల తిరుపతుల ప్రశంస | పద్యం | 51 | నుండి | 71 | వరకు |
| 7. కవి నివేదనం | పద్యం | 72 | నుండి | 95 | వరకు |
| 8. కుల దైవార్చనం | పద్యం | 96 | నుండి | 101 | వరకు |
| 9. నామగుణ కీర్తనం | పద్యం | 102 | నుండి | 106 | వరకు |

చివరి రెండు పద్యాలూ శతకాన్ని స్వామికి అంకితం చేసుకొన్నవి. పై తొమ్మిది అంశాలూ ఈ శతకంలో నవవిధ భక్తులు నాట్యమాడిన విధాన్ని ధ్వనిమయం చేస్తున్నాయి. అలవోకగా జాలువారిన కవితలో కూడా అర్థవంత మైన అంతర్నిర్మాణం అమరి ఉండటం దైవదత్తమైన ప్రతిభ వల్లనే సాధ్య మైన దనటంలో అనుమానం లేదు.

శ్రీ వేమూరి వేంకటేశ్వర శర్మగారు ఈ శతకాన్ని భక్తి ప్రసూనంగా పరిమళింప జేశారేకాని పాండిత్య ఫలంగా పండించ దలచుకోలేదు వారు స్వభావతః వినయవంతులు. నిరాడంబరులు ఆస్తికబుద్ధి కలవారు. భక్తి రసార్ద్ర చిత్తులు. వారి స్వీయ వ్యక్తిత్వ లక్షణాలన్నీ వారి కవితలో ప్రత్యక్ష మౌతాయి. వక్రత జోలికి పోకుండా కవితలో ఋజువర్తనను ప్రకటించారు.

సమాసాడంబరాలను పరిత్యజించి సౌజన్యాన్నీ, సారళ్యాన్నీ శబ్దార్థాలకు అలవరించారు. ఆత్మనివేదనం వారి శతక తాత్పర్యం కవితకు ఆత్మ అర్థం. శరీరం శబ్దం. ఈ కవితలో శరీరం ఆత్మకాంతితో వకాశిస్తుంది వేంకటేశ్వర స్వామి సన్నిధిన వెలుగొందే జ్యోతిలా సౌమ్యసుందరంగా ఒక దివ్యానుభూతిని ప్రసాదిస్తుంది. ఇంతకంటె భక్తి శతకానికి మరేం కావాలి?

శ్రీ శర్మగారు ఎన్నుకొన్న ఛందం తేటగీతి. ఈ పద్యాన్ని గురించి శ్రీ శ్రీ అన్న మాటలు ఇక్కడ స్మరింప దగినవి.

"ఒక అనిర్వచనీయ మహోన్నతము పు
హాయి యున్నది గీత పద్యములయం దు
దరు లొరసి పారు గాంగ నిర్ఝరిణి కరణి
చెంగు చెంగున గీతి తురంగలించు
ఆధునిక దివ్యఖండ కావ్యములయందు
ప్రాణ సన్నిభమై గీతి పరుగులాడు
విస్తృత వనాంతరోదగ్ర వీథులందు
కేళ్లురుకు లేడివలె గీతి త్రుళ్ళుతాడు." (ప్రభవ)

అనిర్వచనీయమైన దివ్యానుభవం కోసం వ్రాసిన ఈ శతకం గీత పద్యాల్లో తురంగలించటం ఎంతటి సార్థకమో శ్రీ శ్రీ పద్యాలు చెపుతున్నాయి.

శ్రీ వేమూరి వేంకటేశ్వరశర్మ కవిత వర్ణనంలో వైదగ్ధ్యాన్నీ, కీర్తనంలో సమత్వాన్నీ, నివేదనంలో ప్రసాదాన్నీ, స్తుతిలో సూక్తి చమత్కారాన్నీ ప్రదర్శిస్తుంది.

"ద్రౌపదీ ప్రాణమాన సంరక్షకుడవు
ఆమె కొమరుల మరణంబు నావలేవా ?
ఎంత నోచిన వారికి ఇత్తువంతె
విశ్వకల్యాణ సంధాత! వేంకటేశ!" (42)

ఈ సూక్తిలో పండిన వేదాంతానుభవం ప్రకటితమౌతున్నది. భక్తిని వివేకంతో జ్ఞానానికి ఉపాంగంగా సంవదించుకునే తాత్త్విక చింతనం శ్రీ శర్మ గారికి ఉగ్గుతో వచ్చిన విద్దె.

శతక నాయకుడు వేంకటేశ్వరస్వామి. శతకకర్త వేంకటేశ్వర శర్మ నామసామ్యం పరమాత్మ జీవాత్మల లక్షణాన్ని వ్యంజింప చేస్తున్నది. మకుటంలో విశ్వకళ్యాణ భావనం పునః పునః వినిపిస్తుంది. భగవద్రతి, దానివలన భగవదైక్యం, దానివలన విశ్వకల్యాణం—అన్నది ఈ శతక సందేశం.

తొలి రచన ఉషస్సులా వెలుగొందుతున్నది. ఇది ఇకముందు ఉజ్జ్వలంగా ప్రకాశించాలని ఆశిస్తున్నాను. ఈ రచన పండిన భక్తి పంట. ఈ కృషీవలునికి నాహృదయ పూర్వకాభినందనలు.

(సం) జి. వి. సుబ్రహ్మణ్యం

# ఒక్కమాట

పరమాత్ముని లీలలు అనేకం.

ఈ లీలల్ని ఆయన ఎవరిచేత ఎందుకు ఎప్పుడు ఎలా చేయిస్తాడో ఎవరికీ అర్థంకాదు

నేను 1986లో తిరుమల వెళ్ళి స్వామి దర్శనం చేసుకొన్నాను. అప్పుడేదో ఒక మహానంద సాగరతరంగం నా మదిలో ఉవ్వెత్తుగా లేచి నూతనోత్సాహాన్ని రేకెత్తించింది. స్వామి యొక్క దివ్యమంగళ విగ్రహం నా కన్నుల్లో కాంతి రేఖల్ని నింపింది. నాలో ఒక అనిర్వచనీయమైన అనుభూతి కలిగింది.

ఇంటికి తిరిగి వచ్చిన కొన్ని రోజుల తర్వాత మిత్రులు శ్రీ భమిడిపాటి కృష్ణమూర్తి గారు కనిపించి సప్తగిరీశుని పైన శతకం వ్రాయండి అన్నారు. నాకంత శక్తి లేదేమోనని సంకోచించాను. కాని ఆయన నా వెన్నుతట్టి "మీరు వ్రాయగలరు. తప్పకుండా ప్రయత్నించండి" అన్నారు పదేపదే.

ఇంతకు ముందు పద్య రచనలేమీ చెయ్యక పోవడం వల్ల పెద్ద ఆలోచనలో పడ్డాను. చివరకి శతకానికి మకుటం స్ఫురించి తటిల్లతలాగా మెరిసింది. వెంటనే శ్రీకారం చుట్టి భగవత్కటాక్షం వల్ల పూర్తి చేశాను.

కలలోకూడా శతకం వ్రాస్తానని, వ్రాయాలని అనుకోని నాచేత ఈపని చేయించడం కేవలం ఆ పరాత్పరుని లీలకాక మరేమిటి ? గుణదోష గ్రహణ పారీణులైన భక్తులు, కవులు ఈ శతకంలో ఏమైనా గుణాలుంటే అవి భగవంతునివి గాను, దోషాలను నావిగాను భావించాలని నా మనవి.

ఈ శతక రచనకి నన్ను ప్రోత్సహించిన సాహితీ మిత్రులు శ్రీభమిడి పాటి కృష్ణమూర్తి గారికి నా హృదయపూర్వక నమస్కృతులు.

ఈ శతకాన్ని పూర్తిగా చదివి, అక్కడక్కడ మెరుగులు సూచించి, నన్ను ఆశీర్వదించి దయతో "పుణ్యకీర్తనం" అనే పేరుతో పరిచయ వాక్యాలు వ్రాసి యిచ్చిన సహృదయులు, నరస నత్కవిత్వ విద్యా వైభవోన్నతులు, బహుకావ్య నిర్మాతలు అయిన శ్రీ ఉత్పల గారికి నా నమస్సుమాంజలులు.

అడిగినదే తడవుగా "భక్తివంట" వ్రాసి యిచ్చారు డాక్టర్ జి వి సుబ్రహ్మణ్యం గారు. వీరు యశోభూషణులు. ఉత్తమ సాహిత్య విమర్శకులు సారస్వత సాగరులు. వీరికి అనేకానేక వందనములు అర్పిస్తున్నాను.

ఈ శతకముద్రణ కోసం ఆర్థిక సహాయం చేసిన శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానం వారికి నేను సదా కృతజ్ఞుడను.

సర్వాంగ సుందరంగా శతకాన్ని ముద్రించి సకాలంలో అందజేసిన "సహజ ప్రింటర్స్" వారికి నా అభినందనలు.


ఇట్లు
భవదీయుడు
**వేమూరి**

27-1-6/6, కృపా కాంప్లెక్స్
నేరేడుమెట్
సికిందరాబాదు - 500556
21-2-1988

శ్రీ

# వేంకటేశ శతకం

శ్రీకరంబగు రూపంబు చెలువు మీర
సప్త గిరులందు వసియించు సార్వభౌమ !
భక్త తతులను బ్రోవుము పరమ పురుష !
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

మూడు నామాల వెలుగొందు ముద్దు మొగము
ముజ్జగంబుల నెల్ల సమ్మోహ పరచి
ముదము చేకూర్చి దివ్యానుభూతి నిచ్చు
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

చిబుక భాగాన నెలకొన్న చిన్ని మచ్చ
తమము హరియించి మించు నుద్దామ లీల
ఉరము నందున్న శ్రీలక్ష్మి కురియు సిరులు
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

కలియుగంబున కల్పవృక్షంబ వీవె
విమల మానస విహరణ విభుడ వీవె
ప్రాణి కోటిని రక్షించు ప్రభుడవీవె
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

ఉగ్ర మీనమై వేదాల నుద్ధరించి
కూర్మ రూపివై మందర కుదర మెత్తి
వెలసి నాడవు జలచర విలసనమున
విశ్వ కల్యాణ సంధాత । వేంకటేశ ।

ఆది సూకర రూపాన అవతరించి
దైత్యు మడియించి భీకర దంష్ట్రచేత
ధరను పై కెత్తి తీవు సంద్రంబు నుండి
విశ్వకల్యాణ సంధాత । వేంకటేశ ।

హరియె సర్వంబు, సర్వంబు హరియె యనుచు
పలుకు బాలుని ప్రహ్లాద భాగవతుని
బ్రోచి నావయ్య నరసింహ రూపమెత్తి
విశ్వ కల్యాణ సంధాత । వేంకటేశ ।

లోక సంరక్షణ క్రియాలోకనమున
సిరులు గల్గియు బలిని యాచించి నట్టి
భూ నభో వ్యాప్త వామనమూర్తి వీవు
విశ్వ కల్యాణ సంధాత । వేంకటేశ ।

గండ్ర గొడ్డలి ధరియించి గండరించి
రాజ్య వైభవ మదమత్త రాజ తతుల
గండడంచితి గండర గండ వగుచు
విశ్వ కల్యాణ సంధాత । వేంకటేశ ।    9

దుష్ట రాక్షస సంహార దృష్టి తోడ
సకల సద్గుణ భవ్య సంచయము తోడ
పుడమి సొచ్చిన రామచంద్రుడవు నీవు
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

ద్వాపరంబున కృష్ణావతార మెత్తి
నరక కంస మురాది దానవుల గూల్చి
శిష్టపాలన మింపుగ చేసినావు
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

జనులు కర్మలంపటు లైన సమయమందు
బుద్ధ రూపము వహియించి ముక్తిమార్గ
సత్య తత్త్వోపదేశముల్ సల్పినావు
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

హయము నెక్కి నీవు కలియుగాంతమందు
పాప కర్ముల, దుర్నీతి పరుల నెల్ల
కత్తి కెరజేతు వందురు కల్కివగుచు
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

శంఖ చక్ర గదాపద్మ చారుహస్త !
దివ్య కౌస్తుభ మాణిక్య దీపితాంగ !
నీల నీరద కమనీయ నీలరూప !
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ ! 14

వైజయంతీ విభూష ! శ్రీవత్స వక్ష !
కాంచనాంబర ! కంజాక్ష ! కంబుకంఠ !
గరుడ గమన ! జనార్దన ! శరధి శయన !
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

విశ్వరూప విభూతివి, విశ్వపితవు
విశ్వనేతవు, దాతవు, విశ్వపతివి
విశ్వ కర్మవు, సాక్షివి, విశ్వగతివి
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

బ్రహ్మ విష్ణు రుద్రాది రూపంబు లీవె
సూర్య చంద్రులు, అష్టవసువులు నీవె
ద్వాదశాదిత్యులున్ నీవె వాసుదేవ !
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

బహు శిరంబులు, బహునేత్ర బాహువులును,
బహు పదంబులు, బహురూప భంగిమలును,
బహు విధంబుల నామముల్ పరగు నీకు
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

నదులు, వనధులు, నగములు, నవ నిధులును
లతలు, సుమములు, తరులు, ఫలములు, కాన
నములు, ఓషధులును, సకలమును నీవ
విశ్వ కల్యాణ సంధాత వేంకటేశ ! 19

పంచ భూతములు, నిఖిల ప్రాణి చయము,
శ్రుతులు, స్మృతులు, మనో బుద్ధి గతులు, కాల
గతియు, యోగవిద్యయు, యోగ గతియు నీవె
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

అఖిల జీవుల యందుండు ఆత్మవీవె
సకల భూతము లందుండు శక్తివీవె
అఖిల జఠరము లందుండు అగ్నివీవె
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

యజ్ఞమవు, యజ్ఞకర్తవు, యజ్ఞపతివి
యజ్ఞ ధరుడవు, యజ్ఞివి, యజ్ఞ రతివి
యజ్ఞ భోక్తవు, యజ్ఞవాహనుడ వీవు
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

జ్ఞాన మయుడవు, జ్ఞానివి, సకల మంత్ర
తంత్ర బీజాక్షరుండవు, ధర్మ తత్త్వ
సత్య సుందర శివరూప సారమతివి
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

వేద శాఖా విహారుడు, విపుల భాగ
వత తపోవన సంచార భార ధూర్వ
హుడును, పూజ్యుడు నైన వ్యాసుడవు నీవు
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ ! 24

సకల విద్యాధికారివి జలజనయన ।
సకల విద్యా ప్రదాయివి జలజనాభ ।
సకల విద్యా విహారివి జలజహస్త :
విశ్వ కల్యాణ సంధాత । వేంకటేశ ।

ఆది మధ్యాంత రహిత । అనంత రూప ।
విశ్వ జనన రక్షణ లయ విభవ । అభవ ।
శత సహస్ర భానుప్రకాశ । పరమేశ ।
విశ్వ కల్యాణ సంధాత । వేంకటేశ ।

పావ హారిణి సురగంగ వాసవాది
దేవ మునిగణార్చిత భవదీయ దివ్య
పాద జలజాత సంజాత గాదె అభవ ।
విశ్వ కల్యాణ సంధాత । వేంకటేశ ।

సుర కిరీట విభ్రాజిత చరణయుగళ ।
నీ వదాంబుజ రేణు సందీప్తయైన
గౌతముని పత్ని పరమ పునీత గాదె ।
విశ్వ కల్యాణ సంధాత । వేంకటేశ ।

పెద్ద కాలంబు మకరితో పెనగులాడి
శక్తి కోల్పోయి గజపతి శరణు వేడ
శీఘ్రమే కరుణించి రక్షించి నావు
విశ్వ కల్యాణ సంధాత వేంకటేశ । 29

"విష్ణువెక్కడ కలడు ? చూపించు" మనుచు
తనయు గద్దించు దైత్యుని కనుల ముందె
నృహరి రూపంబు గైకొని నిలిచి నావు
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

కరకు రక్కసి మూకల గర్వ మణచి
గాధి సూనుని యాగ రక్షణ మొనర్చి
ముని మనమ్ముల నిండిన మూర్తి వీవు
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

గరళ కంఠుని ఘనచాప ఖండనమును
పరశు రాముని గర్వ నిర్వాపణమును
చేయ సాధ్యంబె పరులకు ? చిద్విలాస !
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

రావణు నెదిర్చి భీషణ రణమొనర్చి
ప్రాణముల నిచ్చిన విహంగ రాజు మెచ్చి
ఇచ్చి తీవెగ సద్గతుల్ సచ్చరిత్ర !
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

శబరి యెంగిలి తింటివి సంబరమున
విందు గొంటివి విదురుని మందిరమున
సఖుని అటుకులు తింటివి సంతసమున
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ ! 34

గుహుని సేవలు గొంటివి కూర్మి యెసగ
కపుల సాయము గొంటివి కడలి దాట
చాల చిత్రంబు గాదె నీ చరిత మనఘ !
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

పార్థ సారథివై మహాభారత రణ
రంగ సూత్రధారి వగుచు రమ్యలీల
ధరణి నుద్ధరించిన చక్రధారి వీవు
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

అమర విభుడల్గి కురియింప అశ్మవృష్టి
భీతిగొని పారు గోవగోపీ జనముల
చిత్తమలర గోవర్ధనం బెత్తినావు
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

దుర్మదాంధుల పాలైన ద్రుపద తనయ
నిండు సభలోన దీనయై నిను తలంప
సత్వరంబున వలువ లొసంగినావు
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

ఆలితో గూడి పాండవు లడవులందు
పలు తెరంగుల ఇడుముల పాలుగాగ
కంటికిని రెప్ప రీతిగ కాచినావు
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ ! 39

చండతరమైన కర్ణుని సర్పశరము
విష మహానల శిఖలతో వెడలి రాగ
పాండవేయుని వేగ కాపాడినావు
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

మేనయల్లుని నీవె చంపించి నావు
వాని తండ్రిని పాలింప బూనినావు
కృష్ణ ! నీలీల లెరుగంగ ఎవరి తరము ?
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

ద్రౌపదీ ప్రాణ మాన సంరక్షకుడవు
ఆపె కౌమరుల మరణంబు నాపలేవా ?
ఎంత నోచిన వారికి ఇత్తువంతె
విశ్వ కల్యాణ సందాత ! వేంకటేశ !

భృగుని గర్వంబు మాయించి పిదప విష్ణు
లోకము విడిచి రమను భూలోకమందు
వెదుక వచ్చితి దుర్భర విరహ మొంది
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

భువికి దిగివచ్చి కలియుగ పుణ్యమనగ
దివ్య లీలా విలాస దీధితులు వెలయ
శ్రీనివాసుని రూపాన చెలగినావు
విశ్వ కల్యాణ సందాత ! వేంకటేశ ! 44

సద్గుణవతి పద్మావతీ సతిని నీవు
పరిణయంబైన అలనాటి వైభవములు
కాంచి తరియించె పులకిత గాత్ర వకుళ
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

అజ శివ మహేంద్ర సూర్యచంద్రాది సురలు
ముగ్గురమ్మలు, దిక్పతుల్, మునిజనంబు
వేడ్క వచ్చిరి నీపెండ్లి పెద్దలగుచు
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

నీ పదంబులు పట్టి, పన్నీట కడిగి
కన్య నిచ్చిన ధన్యుడాకాశరాజు
గరిమ కెక్కెను క్షీర సాగరుని కన్న
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

పెండ్లి ఖర్చుల కొరకు కుబేరు నొద్ద
ధనము చేకొంటివయ్య పత్రంబు వ్రాసి
అచ్చెరువు గాదె ! శ్రీపతి అప్పుసేయ
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

సింహ కల్పవృక్ష గజాశ్వ శేష గరుడ
హంస హనుమద్రథాది వాహన మహోత్స
వములు చూడంగ కన్నుల పండువగును
విశ్వ కల్యాణ సంధాత ; వేంకటేశ ! 49

వేద మంత్రాల వినతుల వేదియందు
స్వర్ణ కమలాల భాసిల్లు పాదపూజ
మదిని భావింప మధురాతి మధురమగును
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

అద్రు లందున చూడ శేషాద్రి మిన్న
వేంకటేశుండు మిన్నయౌ వేల్పులందు
సత్యమిదియె ముమ్మాటికి సత్యమిదియె
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

యాత్ర లందున తిరుపతి యాత్ర మిన్న
మహిమ లందున వెంకన్న మహిమ మిన్న
అనుచు వత్తురు నీకొండ కర్థులెపుడు
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

లక్షలాదిగ వచ్చు ముముక్షు జనులు
సప్తగిరితీర భూముల సంచరించి
శాంత చిత్తత నుందురు చింతలుడిగి
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

భయ పిశాచ పీడితులకు, పాపులకును
విబుధ వరులకు, సత్క్రియా విరతులకును
శరణ మీవయె దైవత చక్రవర్తి !
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ ! 54

తొండ మండలాధిపుడు నీవుండు మంది
రమును ప్రాకార యుతముగ అమరజేసి
వాహనము లిచ్చి నీకృపా పాత్రుడయ్యె
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

గురుడు రామానుజాచార్య వరుడు నిన్ను
వివిధ సేవల దనిపి గోవింద పతికి
ఆలయంబును నిర్మించి అమరుడయ్యె
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

వేల కొలదిగ కీర్తనల్ వెలువరించి
నిన్ను సేవించి కొనియాడి అన్నమయ్య
పుణ్య కీర్తను డయ్యెను ముక్తిగాంచి
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

త్యాగరాజును, కృష్ణరాయాది విభులు
కవి వరేణ్యులు, నటులును, గాయకులును
ధన్యులైనారు నినుగొల్చి ధరణిలోన
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

పాదముల చెంత కొలువుండు భక్తవరుల
ఆర్తనాదము లుడిపి అత్యంత కరుణ
భోగ భాగ్యము లిత్తువు భోగిశయన !
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ ! 59

సంకటంబులు తెగటార్చు స్వామి వౌట
నిన్ను దర్శించి తమగోడు విన్నవింప
వేచి యుందురు యాత్రికుల్ వేదవేద్య!
విశ్వ కల్యాణ సంధాత! వేంకటేశ!

"పాహి పాహి" యటంచు ఆపన్న జనులు
మిన్ను ముట్టంగ సతతంబు సన్నుతింప
వరము లిత్తువు వాత్సల్య భావనమున
విశ్వ కల్యాణ సంధాత! వేంకటేశ!

అఖిల లోకైక వంద్యుడవైన నీదు
దర్శనార్థము తండోప తండములుగ
భక్తు లరుదెంత్రు జన్మ సాఫల్య మంద
విశ్వ కల్యాణ సంధాత! వేంకటేశ!

కారు చిచ్చులై కష్టాలు కాల్చుచుండ
ఏడు కొండల నెక్కి నిన్ వేడుకొనుచు
మొక్కు దీనుల పాలిట దిక్కు నీవె
విశ్వ కల్యాణ సంధాత! వేంకటేశ!

అంధమయ జీవనాంబుధి యానమందు
దిక్కు గనలేని వారికి దివ్యమార్గ
సూచి వీవె, సత్యాత్మ దిక్సూచి వీవె
విశ్వ కల్యాణ సంధాత! వేంకటేశ! 64

వేంకటాచల వాసము వెతల దీర్చి
పరమ సుఖశాంతి సౌభాగ్య పదము నిచ్చు
తలప కలియుగ వైకుంఠ ధామ మదియె
విశ్వ కల్యాణ సంధాత । వేంకటేశ ।

నిన్ను భావింప కలుగును నిత్యజయము
నిన్ను పూజింప కలుగును నిత్య సుఖము
నిన్ను సేవింప కలుగును నిత్యయశము
విశ్వ కల్యాణ సంధాత । వేంకటేశ ।

నీదు ధామము శాంతికి పాదునిచ్చు
నీదు రూపము కనులకు నిండునిచ్చు
నీదు తేజము జగతికి నింపునిచ్చు
విశ్వ కల్యాణ సంధాత । వేంకటేశ ।

భుక్తి లభియించు నినువేడ పుణ్యపురుష ।
భక్తి చిగురించు నినుజూడ పరమ పురుష ।
ముక్తి వరియించు నినుగొల్వ పూర్ణపురుష ।
విశ్వ కల్యాణ సంధాత । వేంకటేశ ।

నిత్య కల్యాణ వైభవ నియతి నీది
వచ్చ తోరణ కాంతుల వథము నీది
నిత్య శృంగార సంతోష నిరతి నీది
విశ్వ కల్యాణ సంధాత । వేంకటేశ । 69

సంపదలు గల వాడవు సారసాక్ష !
మహిమ గల్గిన వాడవు మాన్యచరిత !
వడ్డి కాసుల వాడవు వాసుదేవ !
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

నోరు గలవాడ వైనట్టి కారణమున
మొక్కుతీర్చని భక్తుల ముక్కుపిండి
అసలు, వడ్డియు గైకొందువయ్య నీవు
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

వేదదూషణ శాస్త్ర నిందాది భాష
ణములు చొరకుండ నా శ్రవణంబు లందు
పాంచజన్యారవంబులు నించుమయ్య !
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

మాయలో పుట్టి, పెరుగుచు మాయ యందు,
మాయ మర్మము లెరుగని మనికి యందు
భ్రమందుచున్నాను; పాలింప రమ్ము ! రమ్ము !
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

కర్మ మార్గము నెరుగక కనలి యుంటి
భక్తి మార్గము నెరుగక బడలియుంటి
ఆదరించుము ప్రియమార సేదదీర్చి
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ ! 74

ధ్యాన మార్గము నరయక తరలి పోతి
ముక్తి మార్గము నరయక మోస పోతి
అభయ హస్తము నిచ్చి నన్నాదు కొనుము
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

యోగమార్గము తెలియక వీగిపోతి
జ్ఞాన మార్గము తెలియక జడత నుంటి
అభయ హస్తము నిచ్చి నన్నాదు కొనుము
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

ధర్మ మార్గము గనలేక దారి తప్పి
సత్య మార్గము గనలేక సడలి పోయి
నీ పదంబుల బ్రాలితి నిగమ వినుత !
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

పతితుడను నేను, పతిత పావనుడ వీవు
అల్పుడను నేను, నీవు సర్వాధికుడవు
అరయ నన్ను బ్రోవ నీకు శక్యంబు గాదె !
విశ్వకల్యాణ సంధాత ! వేంకటేశ !

ఆర్తుడను నేను, సర్వార్తి హరుడవీవు
భక్తుడను నేను, పరమ దైవంబు నీవు
అరయ నన్ను బ్రోవ నీకు భావ్యంబు గాదె !
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ ! 79

జడుడ నేనైతి, చైతన్య సత్త్వమీవు
మూర్ఖుడను నేను, సువివేక మూర్తి వీవు
అరయ నన్బ్రోవ నీకు మర్యాద గాదె ।
విశ్వ కల్యాణ సంధాత । వేంకటేశ ।

పాలకుడ వీవు, నేనెన్న పాలితుడను
పామరుడ నేను, నీవేమొ పండితుడవు
అరయ నన్బ్రోవ నీకు న్యాయంబు గాదె ।
విశ్వ కల్యాణ సంధాత । వేంకటేశ ।

దీనుడను నేను, దయజూచు దిక్కు నీవు,
జీవుడను నేను, పరమాత్మ వీవు, బుద్ధి
మంతుడవు నీవు, నేనేమొ మందమతిని
విశ్వ కల్యాణ సంధాత । వేంకటేశ ।

కూరుకొంటిని సంసార కూపమందు
పైకి రాలేక అగచాట్లు పడుచు నుంటి
లేవ నెత్తుము కృపతోడ దేవదేవ ।
విశ్వ కల్యాణ సంధాత । వేంకటేశ ।

దివ్యమాల్య దివ్యవసన దివ్యగంధ
విలసితంబగు నీ దివ్య విగ్రహంబు
చూడ గోరుదు నిత్యము సుందరాంగ ।
విశ్వ కల్యాణ సంధాత । వేంకటేశ । 84

మ్రొక్కు లిడియెద భక్తితో మోకరిల్లి
ప్రస్తుతించెద మనమున ప్రణతు లిడుచు
శిరము వంచెద నీమ్రోల పరవశించి
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

నిన్ను ధ్యానింతు నెప్పుడు నిష్ఠ తోడ
నిన్ను ప్రార్థింతు నెప్పుడు నియతి మీర
నిన్ను కీర్తింతు నెప్పుడు నియమ మొప్ప
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

పులకరింతును నామము తలచి తలచి
తృప్తి గాంతును గరిమము నెంచి యెంచి
సంతసింతును మహిమము చాటి చాటి
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

కథలు వినియెద నినుగూర్చి కమల గర్భ !
చరిత పాడెద నినుగూర్చి చక్రహస్త !
భజన చేసెద నినుగూర్చి భవవినాశ !
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

హృదయ పద్మము నందు నీ పదము లుంచి
భక్తి గదురగ ధ్యానింతు ముక్తి కొరకు
కోర్కె తీర్చుము; నన్నేలు కొనుము దేవ !
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ ! 89

చిత్తమంతయు నీయందె చేర్చి యుంచి
తనువు ననిశంబు సజ్జన తతుల గూర్చి
మనువు సాగింతు; నిశ్చల మనసు నిమ్ము
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

విమల దరహాస చంద్రికల్ విరియ జల్లి
నా హృదయవని నింపుము నవ వసంత
రాగ రంజిత కుసుమాలు రహి దలిర్ప
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

పాప భాండంబు లన్నియు వగులగొట్టి
భక్తి పూరిత కలశంబు పాదుకొలిపి
మదిని నిలువుము నిచ్చలు మాయవీడి
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

తప్పు లెన్నియొ చేసితి తామసమున
కలిగె నిప్పుడు కనువిప్పు కమల నయన !
కల్మషంబులు పోగొట్టి కరుణ గనుమ
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

ఎన్ని చదివిన గాని నిన్నెరుగ లేము
సూక్తు లెన్నియు చెప్పిన చూడలేము
కథలు వినినంత మాత్రాన కానలేము
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ ! 94

తరతరంబుల మా కులదైవ మీవు
మరువ నెన్నడు నీనామ మంత్ర జపము
అంద నుండుము నాకు శేషాద్రి వాస !
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

పరిమళంబులు వెదచల్లు విరులు తెచ్చి
మనసు రంజిల్ల భక్తితో మాల కట్టి
నీ గళంబున వైచెద నీరజాక్ష!
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

నీ గుణంబుల నెపుడు చింతించు కొనుచు
శాస్త్ర విహిత సద్ధర్మ సంచార భావ
వీచికా చామరంబులు వీతు నీకు
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

చెలగి నాదు దేహంబునం దలము కొన్న
దురిత ధూమము సర్వంబు తొలగిపోవ
అగరు ధూపము నర్పింతు అఘవినాశ !
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

అనుదినంబును నీపూజ లొనర జేసి
తైల దీపము నొసగెద తనివి దీర
ఆత్మ దీపము వెలిగింపు మాదిదేవ !
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ ! 99

ఆత్మ పులకింప కర్పూర హారతిత్తు
జీవితారణ్య దుర్గమ సీమలందు
దారి జూపుము చీకటి పారదోలి
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

దేవ! పద్మావతీ ప్రియ ! సేవ లివియె
భువన మోహన లీలాంగ ! పూజ లివియె
పూర్ణ శతక గుచ్ఛము మంత్రపుష్ప మిదియె
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

పన్నగాశన వాహన ! ప్రణతు లివియె
విబుధ పోషణ పారీణ! వినతు లివియె
సుజన పాలన ఖేలన ! స్తోత్ర మిదియె
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

ఇందిరా ప్రియ సుందర ! వందనములు
నంది వాహన సన్నుత ! వందనములు
నంద నందన ! సాష్టాంగ వందనములు
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ ! 894.813 UEN

తిమిర సంహార ! వైకుంఠ ! దివ్యతేజ !
భక్త మందార ! కేశవ ! పాపనాశ !
ఆశ్రితామర ! అచ్యుత ! అభయ మిమ్ము
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

Acc no 0105

శ్రీరమాశ్లిష్ట రమ్యాంగ ! శ్రీనివాస !
దేవకీ గర్భ సంభూత ! తిరుమలేశ !
సకల లోకైక రక్షక ! శరణు శరణు
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

మధు నిషూదన ! మాధవ ! మంగళంబు
మహిత గుణధామ ! శుభనామ ! మంగళంబు
మంగళాకార ! శ్రీధర ! మంగళంబు
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

స్వామి ! నీ దయామృత పాన బలము వలన
శతక రచనము సేయంగ సాధ్యమయ్యె
స్వీకరింపుము జగదీశ ! శ్రీనివాస !
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ !

వాసి కెక్కిన వేమూరి వంశమందు
వెంకటేశ్వర శర్మ నామాంకితుడను
చేరదీయుము కల్యాణ ! శ్రీనివాస !
విశ్వ కల్యాణ సంధాత ! వేంకటేశ ! 108

— ఓం తత్ సత్ —